మొదటి కూర్పు 1000

వెల ఒక రూపాయి.

1951 జనవరి

వికృతి, పుష్యమి

ప్రతులకు :—

బూదూరు రామానుజులు రెడ్డి:

తెలుఁగు పండితుఁడు, బోర్డుహైస్కూలు,

తిరుత్తని, చిత్తూరు జిల్లా.

# మనవి

భారతీయ చారిత్రకాకాశమున ప్రజ్వలించు మహోజ్జ్వల తారలలో దుర్గావతి యొకతె. నాకుఁ జిరకాలముగ నా మహారాజ్ఞీమణి చరిత్రమును వ్రాయవలయునను కుతూహలము మిక్కుటముగ నుండెడిది. అది నేటికి నెఱవేఱినది.

ఈ కృతికి, దొలిపలుకు వ్రాయఁ బ్రార్థింపఁగనే. బహుళ కార్య వ్యాపృతులయ్యు, నాయందుఁగల యవ్యాజానురాగమును బురస్కరించుకొని నా కోరికను మన్నించిన మదరాసు. ఉన్నతశాసనసభాధ్యక్షులు. రసజ్ఞులు విద్యా విశారదులు, గౌరవనీయులునగు శ్రీ రాజా బొప్పరాజు రామకృష్ణ రాజు గారికిని, కథాసంవిధాన సందర్భమున నందందు నుచితములగు సూచనము లొనరించి, ప్రోత్సహించిన శిష్యసత్తముఁడు శ్రీ విద్వాన్ వేలమూరు వేంకట సుబ్రహ్మణ్యము, బి. ఎ. ఎల్. టి. గారికిని, నా యీ చిన్నిపొత్తముపై సదభిప్రాయమొసఁగి, చిన్నతనము నుండియు నను సోదర ప్రాయునిగ భావించి. నా కవితా రచనమునకు మార్గదర్శకులై వెలసిన మిత్రులు విద్వాన్ వేదము వేంకట కృష్ణశర్మ గారికిని నా హృదయ పూర్వకములగు కృతజ్ఞతా నమోవాకములు.

ఈ కావ్య కన్య పైఁ గన్నువైచి, చేపట్ట నంగీకరించి. తెలుఁగు నాట దీనికించుక వెలుఁగు కలుగఁదగు పసదనమొసఁగి అన్ని ...యంగులు సింగారింపఁజేసిన యుత్తమకుటుంబ సంజాతుఁడును విద్యాధికుడుఁను, సారస్వతాభిమానియు, సరసుడునగు శ్రీ చిరంజీవి గాలిరామలింగారెడ్డికి, ఇతోధికాయురారోగ్యైశ్వర్యాభివృద్ధియగునట్లు పరమేశ్వరుఁ ·డనుగ్రహించుగాక.

బూదూరు రామానుజులు రెడ్డి.

# కృతి సమర్పణము

వన్నెఁగన్న రెడ్డివంశంపు బంగారు
గనిని వెల్గు స్వర్ణఖండ మతఁడు,
ప్రథితహితుఁడు గాలి రామలింగారెడ్డి
కీ సుకృతిని నెయ్యమెసఁగ నిడుదు.





సామంతవాడ శ్రీ గాలి రామలింగా రెడ్డి, బి. ఏ., బి. ఎల్.
( అడ్వొకేట్, మదరాసు హైకోర్టు )

# తొలిపలుకు

శ్రీ బూదూరువారి 'రాణీదుర్గ' రూపురేఖలు మనోహరములు పలుకు తియ్యన. నడక సెలయేటికులుకు. చరిత్ర పవిత్రము.

'గోటనొక్కని చివురు మూర్కొననిపూవు'—మహాకవి కాళిదాసును స్ఫురింపఁ జేయుచున్నది. అందము రసవంతములుగ నిమిడియున్న చిన్న చిన్న సామెతలు పెద్దన్న ననుకరించుచున్నవి. మొత్తమున చిన్ని పొన్ని నుడులతో ముద్దులు మూటగట్టునట్లల్లఁబడిన యీ చిన్నకావ్యము రమ్యము లగు భావములతో నలరారుచు రసిక జనమునకు హృదయంగమముగ నున్నది.

భాషాభివృద్ధి నాకాంక్షించు విద్యార్థులకును పఠనార్హమై యొప్పుచున్నది.

స్వేచ్ఛయగు దేశమాత కిప్పటి పరిస్థితులఁ దగు రక్షణ మత్యావశ్యకము. శతాబ్దములుగ నణఁగఁ ద్రొక్కఁబడి మాటుమణఁగిన భారతీయ యువతీ యువకుల శౌర్యధైర్య గాంభీర్యాది గుణము లిట్టి వీరగాథలచే సహజతేజము తోఁ బ్రజ్వరిల్లి, యవసరమగుచో మాతృదేవత మానప్రాణముల రక్షింప సర్వవిధ త్యాగములకు వారు సంసిద్ధులగు నట్లొనర్ప నీ చిన్నిపొత్త ముపకరించుఁగాక. గ్రంథకర్తకు నాధన్యవాదములు.

మదరాసు
22-12-50

రా. బొ. రామకృష్ణరాజు,
(అధ్యక్షుఁడు; మదరాసు లెజిస్లేటివు కౌన్సిలు)

# ఆశంసనము

సారస్వతోపాసకులు, సంఘసేవా తత్పరులు, సంలబ్ధ ప్రతిష్ఠులు స్వకులాలంకారులు. సవయస్కులు నగు శ్రీ బాదూరు రామానుజులురెడ్డి గారు నా బాల్యమిత్రులు సమిష్టి కుటుంబములోని సహజానురాగ విలసితు లగు సహోదరుల సంబంధమెట్టిదో, మా యిరువురి మధ్యఁగల సంబంధ మట్టిది. పట్టభద్రుఁడుగాఁడు; కాని విద్యా విశారదుఁడు. అత్యంత సంప న్నుఁడు గాఁడు; కాని యౌదార్య గుణాంచితుఁడు. ఉన్నతాధి కృతుఁడు గాఁడు: కాని పలుకుబడి గలవాఁడు. చిత్తూరు మండలమున నే ప్రముఖునకును లేని పేరు పెంపులు శ్రీ రెడ్డిగారికిఁ గలవనుటలో నతి శయోక్తి యించుకయు లేదు.

ఈ పఱకే గద్య పద్యాత్మకములగు శ్రీ రెడ్డిగారి రచనములు గొన్ని యాంధ్రలోకమునకు సుపరిచితములు. ఇవుడు వెలువడిన యీ 'రాచేదుర్గ' వ్రాఁత ప్రతిని జూచినవుడు గ్రంథకర్త గారి ప్రతిభ కచ్చెరువందితిని. మహాకవి ప్రయోగానుకరణములు, ముచ్చటఁ గొలుపు నచ్చంపుఁదెనుంగు పలుకుబడులు, వినవిన వీనులకాముతలగు సామెతలు, మన నాట నెల్లర నోట - వాలాయమాలించు దేశీయములు - అటనట జాలువారిన యీ గ్రంథ రచనా వైఖరి నవయువ కవుల కొజ్జబంతియనఁదగును. ఆంధ్రుల కుత్తేజ మొదవించు నీ పవిత్ర చారిత్ర మున కద్భుత శయ్యాలాలిత్యము-అందులకు దగినయలంకార సౌభాగ్యము—దానికి సముచితమగు శబ్దజాలావిష్కర ణము గలది, ధారాశుద్ధితోఁ గడుంగడు మనోహరముగ నలరారుచున్నది.

ఇట్టి యుత్కృష్ట చారిత్రక గ్రంథముల యావశ్యకము నేటి మన వారికి—అందును యువకులకు మిగులనవసరము. విశ్వవిద్యాలయాధి కారు లీ యుత్తమకృతి ప్రాశస్త్యమును గుర్తించి కళాశాలలలో దీనికిఁ బ్రవేశముం గలిగించి, భావి పౌరులుగాఁదగు విద్యార్థుల యభ్యుదయమున కించుక దోడ్పడుదురని విశ్వసింతును.

కృతికర్తగారు ఏతాదృశములగు నుత్తమ రచనల నింకను సాగించి దేశమునకును భాషకును జిరతరోపకృతి యొనర్పఁదగు శక్తి సామర్థ్య ము లనుగ్రహింప శ్రీ వల్లభుఁ బ్రార్థింతును.

మదరాసు.—

వేదము వేంకటకృష్ణశర్మ.

# 1

శ్రీ మహాదేవి సతతంబుఁ జిందులాడఁ
బంటలవలంతి యడ్డిగ పతకమట్లు
కళలకిరవయి 'బందేలుఖం' డనంగ
రమణ విలసిల్లు స్వాతంత్ర్యరాజ్య మొండు.

# 2

వీరవనితల వీరాతి వీరవరుల
పుట్టినిల్లయి వెల్గు నాపుణ్యభూమి
తేజు గలవారి కీర్తి చంద్రిక లనంగ
మేలికాంతులఁ జిమ్ము వజ్రాలసీమ.

# 3

దానిఁ బరిపాలనముసేయు ధర్మబుద్ధి
హేమకరణుఁడు నాఁబడు భూమిధవుఁడు
స్వప్రజం గన్నబిడ్డల సరణిఁ గనుచు
వారి రంజింపఁగాఁ బాటుపడు నతండు.

# 4

ఎట్టి సాధుల యందేని నీసుగలుగు
నుక్కివు, లకారణవిరోధు లుందురెపుడు
ఆమహీశుఁడు ధర్మాత్ముఁడైన నేమి?
కుమతు లొకకొంద అతనిపైఁ గుట్రపన్ని.



5

దొమ్మిగా వచ్చి యతని రాజ్యమ్ము నుండి
తఱుమఁ గొట్టఁగ డీల్వాడి దారతోడఁ
బురమువెల్వాడి కాననభూమి కేఁగి
మౌననియతిఁ బ్రశాంతుడై మనఁగడంగె.

6

కాయఁగసురులఁ దినుచు వల్కలముఁ దాల్చి
తిరముగ నృపుండు తన యిష్టదేవత యగు
బిందువాసిని దేవిని డెందమందు
భక్తితో నిల్పి ఘోరతపం బొనర్చె.

7

బహుళ బాహ్య ప్రపంచ సంబంధ ముడిగి
నిశ్చలంబగు మదిని నింద్రియములాఁగి
చిత్త మేకాగ్రదృష్టిని హత్తుకొలిపి
తపమొనర్చెను బరదేవతను గుఱించి.

8

దినములును వత్సరంబు లతిక్రమించెఁ
గాని దేవీకటాక్ష వీక్షణలవంబు
గలుగమి నతండు ధైర్య సంకలితమతిని,
దనదు కుత్తుకఁ దెగ వ్రేసికొనఁగఁ బూనె.

9

అప్పుడు జగదంబ పొడగట్టె నతనియెదుట
దివ్యతేజంబు వ్యాపింప దిశలనెల్ల
నతని వీక్షించి యాయంబ "యౌర! వత్స!
చాలుఁజాలును నిలుపుమీ సాహసంబు.

10

ఆత్మ హత్య మహాపాపమనుచు వినవా?
తగ 'శరీరమాద్యంఖలు ధర్మసాధ
న' మ్మనెడు సూక్తి నెఱుఁగవా? నెమ్మనమున
నచ్చెరువుఁ గూర్చె నీ భక్తి మెచ్చుగొలిపె.

11

అహితుల జయించి నీరాజ్యమధిగమింతు
వింక మీఁదట నీదు వంశాంకురములె
ప్రభుతఁగని ధర్మవిధి జనరంజకముగ
నేలఁగలవు ధరిత్రి వేయేండ్లదాఁక."

12

అనుచు వరమీయ దేవి పాదాంబుజముల
సన్నిధిని ఖడ్గమిడి ప్రభుసత్తముండు
కనుల నానంద బాష్పముల్ గాఱుచుండ
నామెకుఁ బ్రదక్షిణించి సాష్టాంగమెఱఁగె.

13

దేవి సేవించి వేవి, నదృశ్య యయ్యె
మనుజవిభుఁడు రాజ్యమునకుఁ జని బలములఁ
గూర్చికొని, ప్రజ, తనుఁగని పేర్చి చెలఁగ
దండువెడలె నరాతుల దర్పమడఁప.

14

పగతుఁ అత్యంతశౌర్యము బలము మెఱయఁ
బోరు సల్పిరి కాని యవ్వారి నాఁగి
చించి చెండాడ వారలు చేష్టలుడిగి
మూలకొకరుగఁ బరువిడి పోయిరంత-

15

హేమకరుణుఁడు జయశబ్ద మెల్లకడల
నిండ విజయపతాకము గోండు కోట
పయిఁ బ్రకాశింప, వాద్యశబ్దములతోడఁ
బురముసొచ్చె మహోత్సవములు చెలంగ.

16

దేవి సంతృప్తి కానాఁడు భూవరుండు
బలిగఁ దనశిర మొసఁగ సద్భక్తి మీఱఁ
గత్తిఁ గుత్తుక మోప రక్తంబు చిందెఁ
గాన, నాసీమ బందేలు ఖండమయ్యె.

# రాణి దుర్గ

17

నాటఁగోలెను నతని యన్వయము వారె
న్యాయరీతిని భూభరణంబుఁ దాల్చి
ధన కనక వస్తు వాహన తతిని గల్గి
యేలుచుందురు యశ మెల్లయెడల నిండ.

18

హేమకరణుని పిదప నా భూమినేలెఁ
న్యాయమార్గాన మహోబ యనెడు నృపుఁడు
జనుల కష్టసుఖంబులు దనవి గాఁగ
మదిఁదలఁచి రామరాజ్య మియ్యది యనంగ.

19

జారచోరుల కాతండు గాఱుచిచ్చు
పాతకులపాలి కతఁడు దుపాకి గుండు
ఖలనికరమున కాతఁడు కాళరాత్రి
అరుల పౌజుల కతడు వజ్రాయుధంబు.

20

కూటిపేదల స్వర్గపుగో వతండు
కూర్చువారల పెట్టని కోట యతఁడు
సూరివర్యులపాలి మందార మతఁడు
ధర యశశ్చంద్రికలఁ జల్లు దొరయతండు.

# రాణి దుర్గ

## 21

గుణములకు నిధి, విద్యలకుం గొటారు-
పరమకృప కాటపట్టు, రూపమున కిరవు,
శౌర్యమునకిల్లు, నీతి కాస్థానసీమ,
పొగడఁదరమె మహోబా ప్రభుని నృపేంద్రు.

## 22

ఆ ధరాధీశమౌళి కేకైక పుత్త్రి
పుట్టె నెల్లర కల్లారుముద్దు గాఁగ
శోభ వెదఁజల్లు మురిపంపుఁజుక్క వోలె
లలితలావణ్య రాశియై వెలయు నామె.

## 23

గురుల కెదురాడ దెప్పుడుఁ గూర్మిచెలుల
గూడఁ బరిహాసమాడదు, కొలుచువారి
నైన నెగ్గాడ దిసుమంత - యాచకులకు
నిచ్చుచో వెనుకాడ దానృపతనూజ

## 24

తనకుఁ గొడుకైనఁ గూఁతురైనను దలంప
నామెయే కాన రాజామె కన్నికళలు
రాజనీతులు యుద్ధతంత్రములు నేర్పి
యొసఁగె నామెకు దుర్గాఖ్య యోగ్యలీల.

25

ఖడ్గవిద్య గుఱ్ఱపుస్వారి కఱ్ఱసాము
తెగువ రణరంగమున మెల్గఁదగు విధమ్ము
బలము తులఁ బంచెములలోన గెలుచు రీతిఁ
జతురతఁ గడించె దుర్గ నిసర్గమతిని.

26

అమర భాషను బంచకావ్యములు చదివె
బహ్వలంకార నాటక ప్రతతు లరసెఁ
దల్లిబాస గవిత్వ చిత్రములు నేర్చె
భరతనాట్యము సంగీతశాస్త్ర మెఱిఁగె.

27

సుగుణములగని. ప్రియవచస్సుధల సరసి,
కష్టజీవుల కొంగు బంగారు, కూర్మి
చుట్టపక్కాల తంగేటి జున్నునంగఁ
దరుణి విఖ్యాత చరితయై గరిమఁగాంచె.

28

క్రమముగా నామె యౌవనప్రాయ యగుడు
విద్యలకుఁదోడు చాతుర్యవిభవ మెసఁగె
చతురిమకుఁదోడు కార్యదక్షతయుఁ గాంచె
దక్షతకుఁదోడు ప్రాగల్భ్యదశ వహించె.

29

లలితభావము లుదయించె లజ్జ మించె
నగవు గుబుచయ్యెఁ బలుకు బంగారమయ్యె
వలపుఁదలఁపులు మొలకెత్తె మెలపుహెత్తె
దుర్గకు నిసర్గసౌందర్యవర్గ కపుడు

30

గోటనొక్కని చివురు. మూర్కొనని పూవు.
త్రావని మరంద మింతియందము నుతింప
వశమె చిల్వలదొరకైన వాణికైన
ధాతకైనను నతని ముత్తాతకైన

31

పెండ్లిప్రాయము దార్కొన్న ప్రియతనూజఁ
గాంచి తేఁ డాత్మ "నాదుబంగారుపట్టి
కరముఁ జేపట్టఁదగు వీరవరుఁ డెవండొ"
యంచుఁ దహతహపడుచుండె నహరహంబు.

32

రమణి రూపాభిజాత్య గుణములు వినిన
యెందఱెందఱొ ధరణీశు లేఁగుదెంచి
తన్ను బతిమాల ఛందోలు ధరణినాథుఁ
డియ్యకొనఁడయ్యెఁ గన్నెకు నీడుగామి.

33

ఆదినంబుల గోండు రాజ్యంబునందు
శౌర్య ధైర్య పరాక్రమ సాహసుండు
భూరమణలోక సింహకిశోర సముఁడు
ఏలు దళపతిశాహి భూపాలకుండు.

34

నీతిగలవాఁడు సన్మతి నెగడువాఁడు
గరగరనివాఁడు కంతునికాంతివాఁడు
కరుణఁగలవాఁడు దీనులఁగాచువాఁడు
గోండు రాజన్యు మహిమ వాక్రువ్వఁదరమె ?

35

అతఁడు దుర్గామహాదేవి యందచంద
ములను విని యాలతాంగిపై మనసు నిలిపెఁ
జెలువయును దళపతిశాహి బలపరాక్ర
మంబులను విని వానిపై మనసుఁగొలిపె.

36

ఒండొరుల రూప గుణ శీల ముల్లములకు
బట్టి దర్పణములఁ దోఁచు ప్రతిఫలనము
లట్టు తిరమయ్యెఁ, బ్రకృతినే కట్టివేయు
రాగబంధము మించిన రజ్జువేది ?

37

కాని తనవంశమునకన్న ఘనతఁగన్న
యట్టి చందోలు కులమువాఁడగు మహోబ
తనకు సామాన్య సామంత ధరణిపతికి
నిచ్చునే కూఁతు? నని సంశయించె శాహి.

38

అట్టియెడ జయపాలసింగను నృపుండు
వింధ్యపురనేత ఛందోలు విభున కేట
నీయవలసిన కప్పము నియ్యకుండ
నెదురు దిరుగ మహోబ దండెత్తిపోయి.

39

కడిమి వింధ్యపురీశు సంగరమునందుఁ
గావరమడంచి, క్రక్కించి కప్పమెల్లఁ
బెక్కునజరులతోఁ గడువిభవ మడరఁ
స్వపురమేగఁగ జయపాలు చలము మిగిలి.

40

ఎట్టులేని మహోబాను మట్టువెట్టఁ
గోరి దళపతిశాహితోఁ గుట్రలెన్నొ
పన్ను చతనికి దుర్గపై నున్నకోర్కె
ప్రోత్సహింపఁగ, నా గోండు భూవిభుండు.

41

మదిఁ గొనలుసాగు కోర్కె సుహృదులకెల్ల
వినిచి, యారాజు సంబంధమును గుదుర్ప
రాయబారుల బలదేవరాయవరులఁ
దగినరీతి మహోబయొద్ద కపుడంప.

42

వార లరిగి బందేల్ఖండు ప్రభునిపురికి
నతనియాస్థానముం జొచ్చి యర్హరీతిఁ
దమవిభుం డంపినట్టి రత్నంపుఁదొడవు
లంబరంబులు నజరుగా నతని కొసఁగి

43

తగినరీతిని సత్కరింపఁగ నతండు
వినయమున జేని బొంత నాసనములందు
నెలమిఁ గూర్చున్న రాయబారుల కుశలము
లరసి వచ్చిన కార్యంబు నడుగ, వారు.

44

దేవ! మారాజు మీసుతం దేవిగాఁగఁ
జేసికొననెంచి మమ్ము మీచెంత కనుప
వచ్చితిమి, వేఁడుకొనఁగ, సంబంధ మెట్లు
నిర్ణయింతువో భారము నీదెచుమ్ము.

45

అనఁగ నేమేమి? మీనృపు డంతవఱకు
వచ్చెనే? మాదు సంబంధ మిచ్చఁగోనెనె?
కండకావరమో? లేక కనులు గనఁడో?
యంతచులకన యైతిమె యతనికేము?

46

తారతమ్యంబు లింతైనఁ దలఁపకుండఁ
గులవిహీనుఁడు నాకూఁతు గోరుటెల్లఁ
గుబ్జుఁ డున్నతతరు ఫలకోటి కొఱకు
నిక్కి చేఁజాచఁ బూనుట నిక్కువంబు.

47

నక్క యెక్కడ? నయ్యారె! నాకమేడ?
అధముఁ డతఁడేడ? నాదు వియ్యంబదేడ?
పొసఁగునే యిది? నాబొంది నసువులుండ
నని వచింపఁగ గడు విస్మయమును బొంది.

48

మది నిరాశను మ్రాన్పడి మరలఁ దెలిసి
చేయునదిలేక, బలదేవరాయ ముఖులు
మరల తమభూపు నాస్థాని కరిగి యతని
కెఱిఁగి నిలిచిన. వారిఁ బ్రశ్నించె నిట్లు.

49

కాంచినారలె బందేలుఖండు నృపుని?
నేమి వచియించె నతఁడు?, మీరేఁగిన పని
పండో కాయమొ పలుకుకఁ బ్రభునితోడఁ
జెప్పి రంతయుఁ జూసగ్రుచ్చిన విధమున

50

తన్ను బందేలుఖండు భూధవుఁడు మిపులఁ
బరిభవం బొనరించిన పగిది నెఱిఁగి
కనుబొమ ల్ముడివడుచుండఁ గటములదరఁ
బండ్లుగీటుచు సభ్యులవంకఁ జూచి.

51

వింటిరే! ఖండు మన్నీఁడు విఱ్ఱవీఁగి
కండక్రొవ్వున నాడిన కలుకునుడులు
శాహిసింగము నెదిరింప సాహసించె
నెదను నిది బంతులాట యంచెంచె నేమొ.

52

మంచిమాటల కెవ్వని మనసు కఱఁగు?
ఖండఖండంబులుగఁజేసి గాన్గఁ బెట్టి
త్రిప్పకయె బెల్లమిడునె ప్రార్థింపఁ జెఱకు
దేవుఁడేనియు దెబ్బకే దిగులుగాంచు

53

వీడి యీ మేఁకపోఁతు గాంభీర్య మాతఁ
డింకనేని సుతం దెచ్చి యిచ్చి మమ్ము
నభయమును వేడెనా సరి; యట్లు కాని
నాఁ డతని గర్వమడఁచియు, నాతిఁ గొందు.

54

అనుచుఁ బటు భీషణంబుగ నార్భటించి
కొండలను బిండిచేసెడి దండిమగల
వేగఁ బిలిపించి, తనపూన్కి నినిచి, వారి
సమరయాత్రా ప్రయత్నముల్ జరుపు డనియె.

55

అచట దుర్గయుఁ దనతండ్రి యవగడంబు
గోండుపతి పూన్కిఁ దెలిసి, గగ్గోలునంది
కలఁగి దళపతినే తనకాంతుఁ గాఁగ
నొనరుపు మటంచు, మది భవానిని నుతించె

56

చారముఖమున దళపతిశాహి యలుకఁ
బూని తనపైకి నెత్తిరా నూను టెఱిఁగి
గుండె చెదరఁగ బందేలుఖండు రాజు
యెంతకుఁ దెగించె దళపతి యంచు నెంచి

57

అతఁడు తనపైకి వింధ్యపురాధినాథు
సాయమును నమ్మికొని వచ్చుచంద మెఱిఁగి
విస్మయ విచార కోపముల్ పెనఁగొనంగ
నెంతద్రోహము జయపాలు డెంచె నంచు

58

"ఏమి సేయుదు? నిప్పట్టు నేది తెరువు?
'అల్లె కాని' మ్మనఁ వంశ మంతరించుఁ
'గా'దనిన ఘోరయుద్ధము గలుగు. ముందు
నూయి వెనుకగోయి, యుపాయ మెద్ది?

59

అంచు సచివోత్తముం బిలిపించి, కార్య
మడుగ నాతఁడు రాజేంద్ర! యాత్మజకయి
యాత్మనాశమునకుఁ బూన నగునె? మఱియు
గన్య పరుసొమ్మనుట నీవుకనవా? వినవా?

60

ఇంతకును వంశగౌరవ మెసఁగు ప్రభులె
చేరి దళపతిభూపుని గౌరవించి
కొలుచుచుండఁగ నాతని కులముఁ గూర్చి
నీచమని నిశ్చయింపఁగ నేర్తు రెవరు?

61

అంతియేకాక బలవంతుఁ డతనితోడి
శాత్రవంబునఁ గష్టనష్టములు గలుగుఁ
గావున న్నిన్ను నీప్రజం గాచికొనుము
రాజ్య విధ్వంసి కృతి యొనర్పకుము దేవ :

62

ఆసచివు పల్కు సంకుతోఁ బోసినట్టి
తీర్థమయి తేఁడు, దళపతి పార్థివేంద్రుఁ
దనకు నల్లునిఁగాఁ జేసికొనఁగ మదిని
నిశ్చయించుకొనెం బ్రకృతి నికర మలర.

63

తెలివిలేమిని దానయి తెచ్చికొన్న
యాపదఁ దలంగు వెరవు లేనప్పు డెట్లొ
గట్టునం బడు తెన్నుకై కొట్టుకాడు
వలఁ దగుల్కొన్న మీనంబువలె నరుండు.

64

మున్ను కాకాసురుఁడు దనకన్ను లొట్ట
యైన నసువులు నిలుచుట కలరినట్ల
నేఁడు ఛందోజి గూఁతును పీడియేని
రాజ్యము మిగుల్చుకొని యలరం దలంచె.

65

వ్యర్థముగఁ గష్టనష్టములందలేక
శాహకోర్కికి ఱేఁడు శీర్షమ్ము నొగ్గె;
నుడుమువోయినఁ జేయియేఁ గడకుఁ దక్కు
ననెడుసామెత యియ్యెడ సార్థకంబు.

66

తండ్రినిశ్చయమును విని, తనదు తొట్టై
విఱిగి నేతిలోఁబడెనని మురిసెఁ దనయ
తాను గొల్చెడు దేవత దయకుఁ బాత్రు
రాలనైతిని నిన్నాళ్లు కనుచుఁ బొంగె.

67

తక్షణము ఛందవేల్ తన తప్పులెల్ల
దయను సహియించి దుర్గను గయికొనంగఁ
గోరి ప్రార్థించుచుం గమ్మ గారవమునఁ
సరగఁ బుత్తెంచె దళపతిశాహికడకు.

68

అతఁడు ముదమంది తనదు సమ్మతిని దెలుప
నొక్క సుముహూర్తమున నయనోత్సవముగ
రాణిదుర్గకు దళపతి రాజమణికి
జరగె బందేలుఖండానఁ బరిణయంబు.

69

ధన కనక వస్తు వాహన తతి నొసంగి
ఛందపే లల్లుతోఁ గూఁతు సాగనంపు
నపుడు సాకినమరులుచే నశ్రుపూర్ణ
నేత్రుఁడై, గద్గదిక దోఁప నీతిగరపి.

70

"ఏఁగుదెంతును లెమ్మ నేనెడప దడవ
నిన్నుఁగన, బెగడొందకు కన్నతల్లి !
పోయిరావమ్మ ! శుభమును బొందుమమ్మ !"
యంచుదీవించి దుర్గను నని పెఁ దండ్రి.

2

పరిణయంబాది గోండుభూవల్లభుండు
రాజ్ఞియం దతిబద్ధానురాగుఁడగుచు
స్వప్రజాపాలనంబున శ్రద్ధవీడి
యంతిపురమంచె యెపుడు నిశ్చింతనుండు.

72

మోహమను పొఱ గనుఁగప్ప భూవిభుండు
దనసతిందప్పఁ దక్కొండు గనుగొనండు
చిత్తజునిమాయ మునులె వెఱ్ఱెత్తి మదిని
వింతులకు దాసులయి, రతడేమిలెక్క ?

73

భోగ్యతర నర్మదాతీర భూములందు
స్నిగ్ధ కమనీయ సైకతశ్రేణులందు
శారదా యామినీ రమ్యచాంద్రులందు
సతివతోఁగూడి విహరించు. నతఁడు వేడ్క.

74

కమలినులచెంతఁ, బువ్వుటీరములపొంతఁ,
దీవెయుయ్యాలలందూఁగి, తేనెఁద్రాగి,
కమ్మతావులఁదేలాడి, కాంతఁగూడి
యిచ్చఁగ్రీడించు, స్మరు నతఁడెచ్చరించు.

75

ఉవిద యుపదేశములనేని చెవిని నిడఁడు
మంత్రులొనరించు బోధలేఁ మదిని గొనఁడు
వారిమాటలు బధిర శంఖారవముల
రీతి వ్యర్థంబులయ్యె నాతేనిమ్రోల.

76

పుష్పశరుబారి కగ్గమై పొగులువారి
కెందు వీనులకెక్కునె హితులనుడులు?
దమ్మిచూలియు శూలియుఁ దలఁపుచూచి
జోలిమాలిన చేఁతలఁ దూలిపోరె?

77

ఏమి? ఱేఁడిట్టుమాఱె నంచెంచువారు,
అతని కేమిటఁగొఱఁదువ యంచనెడువారు,
స్థిరమె యీ మోహమంచని చెప్పువారు.
నయ్యుఁ బ్రజ రాజభక్తితో నలరుచుండు.

78

జనుల యనురాగబలమున సకలధర్మ
కార్యతతి దక్షులైన ప్రెగ్గడలపూన్కి
మహితమతి దుర్గపై పరామరికవలనఁ
జక్కఁగా రాజ్యపాలన సాగుచుండె.

79

ప్రెగ్గడలు రాజకార్యధురీణులైన
నృపనియోగులు విశ్వాస నిరతులైనఁ
బాలితులు స్వామిభక్తి సంశీలురైన
నేలికెవఁడైనఁ బాలన కేమికొఱఁత ?

80

ఇట్టు లొక కొన్నివత్సరాలేఁగ, దుర్గ
గోండు రాడ్వంశ వర్ధనాంకురముఁ దాల్చె
గర్భమున. నవమాసముల్ గడవ నొక్క
పుత్రునింగనె శుభలగ్నమున ముదాన.

81

నిర్భరానందజలధి మునింగి నృపుఁడు
వైభవంబునఁ బుత్రోత్సవంబుఁ జాట
నింటనింటను బండువు లెసఁగెఁ బురిని
బ్రజలవేడ్కకు హద్దును బద్దులేదు.

82

తమకు యువరాజు పుట్టెనం చమితముదము
నంది పామరజనము లత్యంతభక్తిఁ
బోఁతురాజున కుత్సవాల్ జాతరలను
జేసి మ్రొక్కిరి బాలు రక్షింపుమనుచు,

83

ప్రేమలత కోరకము దొరబిడ్డఁ గాంచి
చుట్టములుఁ గూర్మిచెలికాండ్రు జోదులెపుడు
మురిసి ముద్దులవర్షముల్ గురియుచుందు
రొడులలోఁ జేర్చికొని క్రింద విడువకుండ.

84

తొక్కుపల్కులఁ బల్కుచు నక్కజముగ
నెల్లవారల యుల్లముల్ గొల్లగొంచు
శుక్లపక్షసుధాంశుని శోభమీఱి
దినదినము రాచబిడ్డఁడు తేజరిల్లు.

85.

బాల్యమునసుండియే గొండు ప్రభుసుతుండు
సింహశార్దూలములఁ బట్టి చెనకనుఱుకుఁ
గదనమనఁ గందుకక్రీడ కరణి నెంచు
నౌర రెండవభరతుఁడో యనఁగ వెల్గు.

86

సతత మా రాచకొమరుని శౌర్యమరసి
ముక్కుపై వ్రేలినిడి జనుల్ మోదమంది
"పులికడుపునందు మేకయా? పుట్టు" నంచుఁ
బొగడుచతని, నాశ్చర్యాబ్ధి మునుఁగుచుంద్రు.

87

అక్షరాభ్యాస మొనరించినంతనుండి
గురులపై భక్తితో విద్య గఱవబూని,
వార లెదిచెప్పినను నొకసారి విన్న
మాత్రమున గ్రహియించు సూక్ష్మముగ నతఁడు.

88

నృపసుతుం డుపనీతుఁడై నేర్చె సకల
కావ్య నాటక శాస్త్రముల్ కళలు శ్రుతులు
రాజనీతులు నుం దివర్గములవిధము
లశ్వ గజ రత్న పరిశోధనాదికముల.

89

ఆత్మజుఁడు పదిండ్లయేవాఁ డయినయంత
నవనినాథున కొక తీరనట్టిరోగ
మంకురించె, భిషజ్ఞు లమితశ్రద్ధఁ
జేసిన చికిత్స లేవియుఁ జెల్లవయ్యె.

90

తుదకు దళపతి యాకాంతు బ్రదుకుమీఁది
యాసవిడనాడె. రెల్లవా, రాతఁడట్లు
నవసినవసి కృశించి ప్రాణములుపీడి
నాక సుఖములఁ జూఱఁగొనంగ నేఁగె.

91

అధిపు దుర్మరణ జనిత దుఃఖాతి హేతి
పటల సంతప్త హృదయయై పరితపించి
పట్టపుందేవి దుర్గయుఁ బతిచితాగ్నిఁ
జొఱఁగ సంసిద్ధురాలగు చొప్పు నెఱిఁగి.

92

చుట్టపక్కాలు ప్రజలును జుట్టుమూఁగి
"న్యాయమా? తల్లి! యింతరాజ్యమును బ్రజను
వదలి యిట్లేఁగనెంచు, టెవ్వరికి వీని
నప్పగించెదు? కృపఁజూడుమమ్మ! మమ్ము.

93

సతికిఁ బతితోడిదే యెల్ల గతియు. సైన
గనులు దెలుపని యువరాజుఁ గాంతురెవరు ?
కాన సాహస మిప్పట్ల మానుమమ్మ !
యంచు దెసలెల్ల మార్మ్రోఁగ నడలుచుండ.

94

ఉల్లము కరంగఁ గన్నీరు లురల వారి
ప్రార్థనము ద్రోసిపుచ్చఁగ రానిదగుట
ప్రజల చిత్తానురంజక భాగ్యలక్ష్మి
రమ్య గుణరత్న సంసర్గ రాణిదుర్గ.

95

భర్తృ విరహిత జీవిత భరముతోడ
రాజ్యభారముఁగూడ నిర్వక్రదీక్ష
నూని జనరంజనాను సంధాన యగుచు
ధర్మమార్గానఁ బాలింపఁ దలఁపుఁ గొనియె.

96

అదిమొదలు పురుషవేషము వొదల రాజ్ఞి
హాటకాంచిత రత్నసింహాసనమున
నధివసించి పరాక్రమోదార ధైర్య
విమల మతులొప్ప రాజకార్యములు దీర్చు.

97

అనుదినంబును దుర్గ సభాంతరమున
సకల సామంత పండిత సచివముఖ్య
గాయక వరేణ్య వంది మాగధ కవీంద్ర
వర్గములు గొల్వఁ గొలువుండు వైభవమున

98

ఎవరెవరి నెట్లు గౌరవింపవలయు నెఱిఁగి
మెలఁగనేరిచి, దళపతి మేదినీశు
పాలనంబును మఱపించి ప్రజలనేలెఁ
బ్రస్తుతింపఁగ సజ్జనుల్ పట్టమహిషి

99

అమ్మహాదేవి దివ్య రాజ్యమునఁ గుఱియు
నెలనెలకు మూఁడువానలు, నెమ్మిగలిగి
బక్కనేలయు బంగారు పంటపండుఁ.
గుడువఁగట్టఁగఁ బ్రజకెందుఁ గొఱఁతలేదు.

100

ఈతిబాధలఁ గఱవులఁ బాతకములు
జారచోరత్వములు వర్ణసంకరములఁ
గలికమునకైన గోండునఁ గానఁబడవు.
నాల్గుపాదాల ధర్మంబు నడచుచుండు.

## 117

కాన మెలఁకువతో గోండు రాణి కిపుడె
కఱకుసుల్తాను శక్తి యిక్కారణి' దంచుఁ
దెలుపుదము, మించినక మనతలము గాదు.
'గోటఁబోయెడు పని కొడ్డలేల' ?

## 118

సార్వభౌముని పల్కులు సభ్యులెల్ల
నూపిరియు గట్టిగా విడకుండ వినిరి
పిదపఁ దమలోన గుజగుజల్ పిక్కటిల్ల
నెవరికెటు దోఁచ నట్లని రెల్లవారు.

## 119

కొంద "ఱిది యాడుదానికిఁ గూక" దనిరి.
కొందఱు "వినాశకాలమే గోండు" కనిరి.
కొంద "ఱిది పాదుషా యోర్చుకొనునె" యనిరి.
కొంద 'ఱారాణి ననిఁ జెఱగొంద' మనిరి.

## 120

అంత సభలోని కలకలమాపి, కేలు
మోడ్చి, సుల్తాను నెదురను మోకరించి
బీరబల పండితుండు సవినయయుక్తి
ననెనిటుల్, ప్రభు! నాపల్కు లవధరింపు.

121

ఉన్నరాజ్యము చాలక యూరకేల
రాజ్యపుత్రులపయి నీ పరాక్రమంబు
మాటిమాటికిఁ జూపెదు ?, మనకు నిట్లె
యెల్లకాలము సాగునం చేమినిజము ?

122

ఎల్ల రసపుత్రదుర్గము లించుమించు
గెలిచినాఁడవు కలన, నీవలన వారు
కష్టనష్టము లొందిన కతన నిన్ను
స్వమతవిద్వేషివని యెన్న సాగినారు

123

రాజపుత్రులు పౌరుష ప్రథితధనులు
వారిఁ బోఁద్రోలి తద్దుర్గవర్గ మివుడు
గైవసము చేసికొన్నట్టు గాదు, రేపు
వడ్డితోఁ గ్రక్కవలయును వసుమతీంద్ర !

124

పాముతోఁ జెలగాట మెప్పటికిఁ దగదు,
తేఁపతేఁపకు వారిని రేఁపుటుడుగు,
మింకనైనను శాంతింపు మెట్టులేని
సఖ్య మొనరింపు వారితో సార్వభౌమ !

109

చటుల భీకర తృష్ణా పిశాచ మతనిఁ
బట్టి యేడాటలాడించి బందిసేయుఁ
బాప మద్దాని నిరసించు పటిమ లేక
పాదుషా యెప్డుఁ దంటాలు పడుచునుండు

110

'నేఁటి కీ రాజు గెలిచితిఁ బాటవమున
నెవని సాధించుటో రేపు కవిసిముట్టి.'
యనెడి చింతయె యాతని మనసుఁ గలఁచు
నేడు దీవుల ప్రభునకేఁ బీడదాస.

111

హైందవాళికి స్వాతంత్ర్య మడఁచు నాస
తనదు సామ్రాజ్యమును బెంపఁ దలఁచు కాంక్ష
భారతీయాంగనలను జేపట్టుతృష్ణ
యీ దురాశత్రయ మతని యెదఁ గలంచు.

112

సామమునఁ గొన్ని దాన దక్షతను గొన్ని
భేదమునఁ గొన్ని దండదుర్విధిని గొన్ని
గాఁగ హైందవ రాజ్యదుర్గముల నెల్ల
లోఁగొనియె నాఁత డెంతటిలోభమతియొ.

113

ఆదినంబుల గోండు దేశాభివృద్ధి,
దుర్గ యస్పంద విక్రమ దోర్బలముబు
విన్న సుల్తానుకెంతయుఁ గన్నుగుట్టి
నాఁటగోలెను దన్నాశనంబు నెమకె.

114

అగ్నిపర్వతమున యట్టు లంతరంగ
సీమ గన్న యసూయాగ్ని చిమ్మిరేఁగ
నిండు కొలువున నొకనాఁడు దండనాథ
మంత్రి ముఖ్యులఁ గని మొఘల్ మహిపుఁ డనియె

115

"వింటిరే యిన్నినాళ్ల కీవింతవార్త?
గోండట! స్వరాజ్యమఁట! కడుగొప్పదంట!
హిందువఁట! యాఁడుదఁట! దానినేలునంట!
ఆమె మాసార్వభౌమత నడ్డునంట!

116

ఈమహోద్ధత వనిత సహింపనగునె?
యెట్లొ సహియించితిమిపో, మఱింతరేఁగి,
'యేకు మేకయినట్లు'గ నేపుమిగిలి
మొఘలు సామ్రాజ్య మడుగంటిపోవఁజేయు.

## 101

అడ్డదుడ్డాల సుంకంబు లనుటలేదు,
గ్రాసవాసాల కెవరికిఁ గఱవులేదు.
ప్రజలకెన్నండు బానిసత్వంబు లేదు,
లేదనుట రాణినోటను లేనెలేదు.

## 102

గాండ్రనుచు బొబ్బరించుచుఁ గవియఁజూచు
బెబ్బులివి వేటలంబట్టి యుబ్బడంచి
వాడికోఱల గోళుల నూడఁబెఱుకు
వీర దుర్గావధూటి కెవ్వారు సాటి?

## 103

శాంతతేజంబు లాయాయి సమయములకు
యోగ్యమగునట్లు సూపు, చుద్యోగివితతి
కామె యభిగమ్యురాలుగ నప్రధృష్య
రాలుగాఁ దోఁచి మోదభయములు గొలిపె

## 104

ఖ్యాతిగన్నట్టి గోండురాజ్య స్వతంత్ర
లతకు మాఱాకుగాఁగ మెలంగుదుర్గ.
యామహావీరమాత, పుణ్యాత్మురాలి
జీవనం బద్దిరా! కడుఁబావనంబు.

105

రాణికిఁ బ్రజోపకారాను రక్తి యెంతొ
ప్రజల కారాణియెడఁ గల భక్తియెంతొ
చిలుకతేనికిఁగాని, యానలువకేని
పలుక వీల్గాదు, రచనలఁ దెలుపఁగాదు.

అట్టియదనున ఢిల్లి మహాపురమునఁ
బ్రాజ్యమగు మొగలాయి సామ్రాజ్య మేలు
సమరభోజనుఁడైన ప్రచండమూర్తి,
చారుసితకీర్తి, యక్బరుచక్రవర్తి.

107

అతని 'నిష్పక్షపాతి' 'దయామయుండు'
'దండితారాతి' 'గండరగండఁ' డనుచుఁ
బలుతెఱంగుల నుతియింత్రు ప్రజలు. గాని
సన్నుతియొనర్ప రతని తృష్ణను గుఱించి.

108

అమ్మహీశు పేరాస కంతమ్ములేదు,
అనుదినము దండయాత్రలె. యహరహమ్ము
బహుళవిజయోత్సవములె. యెవ్వరికిఁగాని
తేఱసొమ్మనఁ దేనియ తీపిగాదె!

125

నాఁడు జగమల్లుఁ గూల్చి చితోడుగడము
వట్టితిమి గాని యేమయ్యెఁ దుట్టతుదకు
లోన జొఱఁబడ నొకపురుగైనఁ గలదె ?
పాడుకోటయ కద వశపడియె మనకు

126

గోండు దుర్గము నటులె చేగొనఁగవచ్చు
రాణిదుర్గను జెఱవట్ట బ్రహ్మతరమె ?
ముక్కునం దూర్పగల రసపుత్రవనితఁ
దాఁకనేర్చునె బ్రదుకంగఁ దలఁచు వైరి".

127

పండితుని వాక్యములు బలపఱుచు చంతఁ,
బలికె మాన్సింగు వినయంబు దొలఁక నిట్లు,
ప్రభువరేణ్య ! మదారివర్గముల తలలు
ద్రుంచు తమఖడ్గ మటలపై దూఁకదగునె ?

128

'అమిత కరుణామయుం డక్ప' రన్న తమదు
చంద్రికా ధవళంబగు సద్యశంబు
మాయ, భీరుకయైన సీమంతినిపయి
సాహసంబుమ నెఱపుట చనదు వినుఁడు

129

అపుడు తోడరుమల్లు సైన్యాధినాథుఁ
డిట్లనె ; ‘‘హుసాదు, భూపాల ! యీసుమాంగి
యేటి కెదురీఁదగా నెంచె. నెట్టులోర్చి
నిల్చుఁ, గనుగొంద, మిటో యటో తేల్చవలయు’’

130

అనఁగ దళవాయి యసపుఖా ననెడు జోదు
లేచి, చేసిసలాము, వల్కెను, ‘‘మహీశ !
కార్యసాధనమున కిప్డు గానియట్టి
దండనాధుని పల్కు లటుండనిండు !

131

రాజనీతిజ్ఞులంద్రు కర్జములనెల్ల
సామమున నెఱవేర్చుట సరియటంచు,
దండమన్ననో చివరిది, ధరణిపతులు
మొట్టమొదలనె దానికై పూనుకొనరు.

132

కాన నొకరాయబారి నీక్షణమ వేగ
గోండురాణికడకు నేఁగి కూర్మిపేర్మి
సామరస్యంబు నెఱపఁ బుచ్చంగరాదె ?
గోరఁబోయెడు పని కొడ్డలేల ?

133

అనఁగ నాతని నుడులకు హర్షమంది
రెల్ల సభ్యులు, సుల్తాను(పాదుషా) హృదయసీమ
కదియ యప్పటి కుచితమైనదిగఁ దోఁప
మంత్రులును దానిపట్ల సమ్మతముఁజూప.

134

ఆయసఫ్ఖానుఁ జేరి నీవరిగి దుర్గ
కెఱుక పఱచుము, మాయాన నెపుడు మాకుఁ
గప్పమొసఁగుచు నెయ్యానఁ గలసిమెలసి
యుండఁగోరుము తియ్యము లుట్టిపడఁగ.

135

అద్దికాదని రాణి మాఱాడెనేని
యుద్ధయాత్రకు సిద్ధమైయుండు మనుము,
క్షాత్ర మవ్వలఁ గరుణింపఁ జాలదనుము,
నయభయంబుల నామె మానసము గొనుము.

136

ఈవిధంబుగ పాదుషా హెచ్చరింప
ఖానుసేనాని మన్నినియానఁ దాల్చి
తగినసిబ్బందితో నాఁడె తరలిపోయి
కొన్నిరోజులు పయనించి గోండుఁజేరె.

137

ఆమహామోధురాక విన్నంత దుర్గ
యెదురుచని స్వాగతంబిచ్చెఁ ముదము బత్తి
గదుర సేవకు లతిథిని గారవమున
సత్కరించిరి రాజోపచారవిధుల.

4.

అంత షహబునాడు ఖానుఁ దత్యాశ తొడర
నతులమణిమయ హేమ సింహాసనమున
నిండుకొలువున్న దుర్గ సన్నిధిని నొండు
పీఠము నలంకరించి సంప్రీతి మెఱయ.

139

“ఓ మహారాణి! మాపాదుషా మహాత్ముఁ
డొక్క సందేశమును బంపియున్నవాఁడు
మెముదలయేని వచియింతు, మీకుమాకు
గ్రమముగా నది శుభగౌరవములఁ దెచ్చు.

140

తేజమీఱు మాసామంతరాజులబడి
కప్పమునొసంగి మాతోడఁ గలసిమెలసి
యుండఁగోరుదు మీసూత్ర ముభయులకును
మహిత సంపత్కరంబు క్షేమంకరంబు.

141

ఈహితం బెన్న మీమది కెక్కదేని
కదన మవ్విధి విధిలేని ఘట్టమగును
పచ్చినెత్తురు కాల్వలై హెచ్చిపాఱ
వెనుక చింతించు టెంతయువెఱ్ఱిగాదె!"

142

అనుచు లోన విషంబు నాల్కను మధువును
జిలుకు సేనానిపలుకులు ములుకులట్లు
గాటముగ నాట సభ్యులు కలఁతనొంది,
సహజగాంభీర్య శౌర్యముల్ సందడింప.

143

"ఔర! యింతలుపుట్టునే!" యంచు 'పాదు
షాకు తలదిమ్మ పో,నంచు వీఁక "ఖాను
గట్టుఁడీ కొట్టుఁ"డను వారి కలకలంబు
బిట్టుగా రేఁగె జలధి ఘోకొట్టినట్టు.

144

అపుడు దుర్గామహారాణి "అకట! మీరు
తలకు పదినాల్క లున్నట్లు పలుకనేల?
దూత వధియింప నీతియు ఖ్యాతిగాద",
టంచు వారిని వారింప నడఁగెసద్దు.

145

అవల ఖానుని వీక్షించి యాసుధన్వి
'ఓమహాశయ ! మీపాదుషా మనంబు
నెఱుఁగమే? యమాయకులకు నెఱుకవడునె ?
యేల యీరాయబారాలు చాలుఁజాలు

146

మన్ను పొన్ను పెణ్ణాసల మరగి యెంతొ
వీరవరుఁడను పేరున విఱ్ఱవీగు
కూట నెయ్యంపు సూత్రాల గొనబు మీఱ
నల్లు సాలీని మీతేని నౌనె పొగడ !

147

వాటమగు వియ్యములు పేసి మేటిపనుల
మప్పి బందాలుగాఁ జేసి మహిమఁ దనరె
హైందవుల కెగ్గుగావించి నట్టివాఁడు
వసుధ మీదొరకంటె నెవ్వాఁడు గలఁడు.

148

పాప మీ కీలెఱుంగక పాడువడిన
పామరులు గొంద ఱతని పేబాసటంచు
మెచ్చికొందురు సాగెఁబో యిచ్చకములు
సర్వసాక్షి యెఱుంగఁడే సత్యమెల్ల !

149

అతనియానకు తెక్కులు నమరునేని
మింటికెగఁబ్రాకి స్వర్గంబు మించునట్టి
మేటిసామ్రాజ్య మొండు నిర్మించి యపర
కౌశికుండన వెలయఁడే ఘనయశమున.

150

వగచినట్లుండవలయును వానియాలి
త్రాడుతెగవలె' నన్న విధాన మీరు
పల్కుపల్కులు రగిలెడి పడుకులట్లు
చుఁయ్యి చుఁయ్యని కాల్చు నీచొప్పుగలదె.

151

అతనియానతి సలుపఁగా హితమగునఁట
కానిచో పోరు తప్పక కలుగునంట
వెనుక చింతింప లాభము వెలయదంట
ఏల మీఱేని కీకల్లయేడ్పులెల్ల !

152

ఇట్టి ప్రతినల మమ్ము జయింపఁదరమె ?
వేడినీటను గొంపలు ప్రేల్చనగునె ?
యుడుత యూపులకే చెట్లు వుడమిఁబడునె?
శశము తాటాకుసద్దుకు జడిసిపోనె ?

153

అక్బరు నిజంబుగాఁ గరుణాళువైన
పరుల స్వేచ్ఛను బోఁదట్టు భావమేల ?
కప్పమో కయ్యమో యను కఱకులేల ?
ఔర ! యీగాలిమేడల యాసలేల ?

154

గొంతులోఁ గొఱప్రాణ మున్నంతదాఁక
లొంగి యుండుట యది కలలోనివార్త
దేవసేవకు మించిన దేశసేవ
వదలమెన్నడు మాదీక్ష యిదియ సుమ్ము.

155

మానధనమును గోల్పోవ మనసులేక
శిరమునైనను బలిసీయ సిద్ధపడిన
వీరసంతతిఁ బుట్టిన ధీర నన్ను
వంశసౌగంధ్యవాసనల్ వదలిచనునె ?

156

ఓయి ! వచియింతు మాటలు వేయునేల ?
రణమునం దస్మదీయ శాత్రవ కఠోర
కంఠ లుంఠన భీకరాఖండ చండ
మార్గణాసారమోర్చునే మలకదండు

157

పూజ్యమగు మాదు స్వచ్ఛందరాజ్యమందు
నీవు చూచినవారలు విన్నకనియు
విన్నవారలు వీరాధివీరులనుము
ఒక్కఁడేనియుఁ బిఱికి పలొక్కఁయనుము.

158

అవని నేరికి వాదు శ్రేయంబుగాదు
పరులస్వేచ్ఛకు నోర్వమి పాడిగాదు
నాతిపైఁ గత్తిఁగట్టుట నీతికాదు
కదనమన కందుకక్రీడ కాదుకాదు

159

విశ్వసోదరభావంబు వెలయ నెల్ల
వారి సుఖదుఃఖములఁ బాలు పంచుకొనుచు
శాంతముగ నుంట పరమార్థసాధనమని
సరగఁ దెల్పుము పాదుషా కెఱుకవుట్ట

160

మాదు స్వచ్ఛందతేజంబు మాయుపట్ల
ఘోర విజయంబుఁ గొందుము పొసఁగదేని
వీరనాకసుఖంబులఁ జూఱఁగొందు
మేము దాసులుగాము సలాముపొమ్ము''

161

అనుమహావీర వాక్యంబు లాలకించి
జయము దుర్గకు గోండుకు జయము జయము
జయము హిందూమతమునకు సతతమంచు
నుబ్బి సభ్యులు ఘోషించి రబ్బురముగ.

162

అంత విఫల ప్రయత్నుఁడై యసఫుఖాను
పట్టణంబునుజేరి నిబ్బరపు మదిని
పాదుషాశ్రమోల నాగోండు ప్రాభవంబు
వీర దుర్గాతిశయముల విన్నవించి.

163

"ఎంత యధికారమున్న మతేమియున్న
నొక్కయాఁడుది మొగలుల ధిక్కరించె"
నంచు రాణి వచించిన యాగడముల
మండుకొలిపిని వెగఁద్రోయు మాడ్కిఁదెల్ప.

164

గాఢముగ దోఁకద్రొక్కినఁ గసిమనంగి
బుస్సుమనిలేచు నాగంబు బోలెమొగలు
నేత యీర్ష్యానలంబోర్వ నేరకపుడె
వీరవరులజీవ రులఁజీరి పలికె.

165

పాదుషాయన్న సుంతయు భయములేక
యకటవికటంబులను బల్కెనంట దుర్గ!
అవును బుట్టువుతో నొప్పుచెవుల మీఁది
నిరుడువచ్చిన కొమ్ములు నిక్కిచూచు.

166

ఖాను సుఖదప్రబోధముల్ గంగఁగలిపి
నాహుకుము సైతమెంతొ యనాదరించి
బీరములు చాటునంట యావీరవనిత
అత్తకును మొల్చెఁబో మీసలౌర! నేఁడు

167

అసపుజీ! సంధియగుననునాస నీవు
పడిన శ్రమమంతయును నిట్లు వ్యర్థమయ్యె
సామమునఁగాని యీ పని చక్కఁబెట్ట
వలయుదండమునఁ, నీదెఖారమింక

168

చేటుఁగాలము దాఁపయ్యె 'జెట్టుచెడుస
మయమునకుఁ గుక్కమూతి పిందియలు పుట్టు'
నన్న రీతిగ గోండు రాజ్యమున, కిందు
దుర్గదేగాని మనదేమి దోసమింక.

169

ఈపరిభవంబునకు రేపె యీడుగాఁగ
నతుల సైన్యంబుతో దండయాత్ర వెడలి
శౌర్యమునఁబోరి మన వీరజయపతాక
స్థిరముగా గోండునం బ్రతిష్ఠింపుమయ్య.

170

చక్రవర్తిముదల శిరసావహించి
ధైర్యశౌర్య మహాబలోదగ్రులైన
యోధవర్య సహితుడయి యుద్ధయాత్ర
సేయఖానుఁడు సర్వసంసిద్ధుఁడయ్యె.

171

తెచ్చివైఋులు చెలరేఁగి వచ్చుటవిని
యెలమిమై ర క్తబలికొాఱకెదురుచూచు
దుర్గవలె దుర్గబంధుమిత్రులను మంత్రి
వరుల బలభీమసేనాధిపతుల నరసి.

172

"సంధికై మొన్న యిటువచ్చి చనినదూత
క్రూరుఁడౌ పాదుషాకేవొ గ్రుచ్చిచెప్పి
దండయాత్రను సాగించి తరలివచ్చె
నౌర ! సత్యంబు ధర్మంబునడవిఁజేరె.

173

న్యాయవిరహితు, సబలు 'నచ్చా'యటంద్రు
దోసమెఱుఁగని దుర్బలు ఘాయటంద్రు
పరమసాధుల గోవులఁబట్టి చంపు
కటిక వారలకెందేని కరుణయున్నె.

174

స్వేచ్ఛనాఁబడు సంగ్రామ సీమయందు
విజయులగుటకు ధైర్యంబు, వీరపటిమ
సత్యసంధత యాత్మవిశ్వాసములను
నాయుధంబుల విడువకుఁడార్యులార !

175

అరికిలోబడి యాను పాయసముకంటె
స్వేచ్ఛమై త్రాగుగంజియే ప్రీతిఁ గూర్చు
బానిసపు జీవనంబు తప్పనియదనున
శలభముంబలె నాత్మనాశనము మేలు.

176

తాత తరములనుండి స్వాతంత్ర్యరథము
సాగుచున్నది మనసీమ జానుమీఱ
కట్ట ! నేటికి మొగలుల గడబిడలకు
నదరిబెదరిన నవ్వరే యఖిలజనులు.

177

మన స్వతంత్రత హైందవ మతవిభవము
బద్ధకంకణులగుచు సముద్ధరింప
వలయుఁగాదేని యసువుల వదలవలయు
బొందిలో గ్రాగు నొక రక్తబిందువున్న.

178

దైవయోగంబు కర్మసంధానమనెడి
పిచ్చి వేదాంతములఁ బ్రొద్దుపుచ్చరాదు
పగఱ మార్కొనమియు రాచపాడిగాదు
రణముకంటెను కార్యాంతరంబులేదు.

179

పుట్టు వారందఱెన్నాళ్లు పుడమినున్న
చచ్చుటె తిరంబు గాన సుక్షత్రియుండు
మానధనుఁడేదొ రుగ్మత మడియు కంటె
కత్తిపోటుల నీల్గుటే ఖ్యాతిగాదె ?

180

హైందవోన్నతిఁ జాటుఁడో యనఘులార !
మనస్వతంత్రత నిల్పుఁడో మాన్యులార !
తల్లిఋణమును దీర్పుఁడో తనయులార !
అర్యమ సమానులార ! యోయన్నలార !

181

బెండుదేలక యోచనయొండు లేక
యట్టైనడుము బిగించి తయారుగండు
వేడ్కనిండారమదిని వేవేగలెండు
పోరునకు పొండు విజయంబు పొందిరంచు'

182

అను మహారాణి యుద్బోధలాలకించి
సహజ దివ్యప్రతాప విశారదులగు
గోండు వీరులు 'జే' యని ఘోషపెట్టి
దురమునకు సరభసముగఁ దరలిరంత.

183

ఇంతలోలగ్గలకు నెక్కియేఁపు మిగిలి
దుర్గమును ముట్టడించిన తుఱకదండు
తెరలిచిందర వందరై పరవ గోండు
సేన బురుజులపయి నుండి చేసెరణము.

184

రెచ్చియీఁటెలతో గుదిగ్రుచ్చినట్లు
శత్రువీరులఁ బొడిచి పీచంబడంచి
కోటకెగఁబ్రాకు యోధులఁగూలునట్లు
ద్రిమ్మరించిరి కళపెళందెర్లు చమురు,

185

విచ్చిపోరెడు జోదులవెంటఁదఱిమి,
యరిబలంబుఁ బ్రవేశింపనిరుదెగలకు
దౌష్ట్యకయ్యమ్ము వర్తిల్లె. దుర్గయపుడు
వాజిపైనెక్కి సామాన్యభటునివోలె.

186

అంతటం దానయ్యెఘోరు నవసరమునఁ
దనదుసేనల్ మహోత్సాహమునఁ జెలంగి
బవరమొనరింప సులతాను బంట్లువీఁగి
పాఱఁగాఁజూచి యసపుఖాఁ భయముగదుర

187

మిగిలిన బలమ్ముఁదోకొని సగముచచ్చి
యెటులో ఢిల్లీ పురంబునకేఁగి, తేని
కోటమిని విన్నవింప, "నిదేటికిట్లు
గడచిపోయినదానికిఁ గలఁతవడెదు"?

188

అనుచు నూరార్పఁబాదుషా, యసపుఖాను
బిడియమునమోము వ్రాల్చి, యోపుడమితేఁడ !
యెట్టులేనియు గోండును మట్టిగలిపి,
కాని యీసారి ఢిల్లిలోఁగాలు మోప.

189

మొదటితప్పిది, మన్నించి, సదయమతిని
బంపుదీవించి, చతురంగ బలమొసంగి,
బవరమున దుర్గ కపవర్గ పదవిఁజూపి
గోండు రాజ్యమ్ము దమ్మునఁగుతిలపఱతు.

190

అని మనవిసేయ పాదుషాయాత్మఁబొంగి
యెంతకైనను జాలుదు వీవు. ఖాన!
గానఁబేర్గన్న పోటరుల్, కడిమమెఱయు
వాహినులు వెంటరా రేపె బయలుపెడలు.

191

అసపుఖానుఁడు సుల్తానునాజ్ఞవడసి,
దొడ్డఫౌజునుగొని, తన్నుఁదొడరవచ్చు
టెఱిఁగి. దుర్గయు సన్నాహ మేమరకయ
సలుపు, చాత్మబలముఁ బురికొలుపుచుండె.

192

అట్లు సన్నద్ధమైయున్న యరులపూన్కి
నెఱుఁగకయ, మ్లేచ్ఛవాహినులెత్తివచ్చి
తాఁకుటయు, నిరుపక్షముల్ పీఁకసెడక
పోర. గెలుపోటముల్ పోల్పఁబొసఁగదయ్యె.

193

రెండునాళ్లిట్లు దురము వర్తిల్లినంత,
గోండుసేనలురేఁగి పైకొనెడు కొలఁది
మూఁడవదినంబు వెనుదీపె మొగలుదండు
వసపుఖానాది సేనానులడలుచుండ.

194

అవి మొవఁజావిచ్చిపాఱు సైన్యమును జూచి
గుండెదిగజాఱి, ఖానుండు గుప్పగూలి
తెప్పిరిలి సుంతయోజించి తెలివిఁగాంచి
దండమన్న పజీర్ఖాను దండనాధు.

195

చేరి, మిత్రుఁడ! చూచితే సేనలెట్లు
చెదరిపోయెనొ? యింకేమి చేయనగుమ?
నాకుఁజాలవివేళ, భూనాథుకడకు
నేమొగమువెట్టుకొనిపోదు? — నేది తెరువు?

196

వైరిని జయించికాని నేఁబట్టణమునఁ
గాలువెట్టవటంటి భూపాలుతోడ
నతఁడు నామాటనమ్మి వన్నవిికిఁ బంపెఁ
జివరకిటులాయె, నాపంతమెల్లఁబోయె.

197

కానసీవేఁగి పాదుషా మావసమున
కెక్కునట్లుగఁ బలికి యెట్లైనఁ గొంత
బలఁగమును దెచ్చితేని యెప్పాటనైన
గెలుతుమీసారి. శంకింపవలదు బొమ్మ.

198

నీవువచ్చెడునందాఁక నిలిచియున్న
దళముతో నెచ్చటనొ తలఁదాఁచికొందుఁ
బొమ్మ బొమ్మన్న నావజీర్ సమ్మతించి
పయనమయ్యెను ఢిల్లికి హయమునెక్కి

5

నాలపదినాన దుర్గము మ్రోలరిపుల
యలికిడియెలేమి గోండు వారలు గ్రహించి
రాజ్ఞికెఱిఁగింప నామె చిర్నగవుదోఁప
నిట్టులనె ; వారలేఁగిరం చెంచవలదు.

200

మొఘలు ప్రభుఁడతిమూర్ఖుఁడు మోసగాఁడు
మనములోఁబడుదాఁక పూన్కినివిడఁడు
అతని పథకము బ్రహ్మకేనరయఁదరమె ?
యప్రమత్తులరై యుండుఁ డదియలెస్స.

## 201

ఏక్షణమున భేరిమ్రోఁగునో యాక్షణంబ
దురము సేయఁగ సిద్ధమై దూఁకవలయు
శూరులగువారు తమ నేర్పుచూపవలయుఁ
బరుల నుఱుమాడి కీర్తిఁ జేపట్టవలయు.

## 202

సర్వశక్తులగొండును జదువుచేయ
యత్నమొనరించు నీతూరి. యవనబలము.
గాన, వేవెవులను వేయిగనులు గలిగి
మెలఁకువం జరియింపఁగ వలయు మనము.

## 203

సమరమునగెల్పు మనకు నిశ్చయమె? జయము
బురదఁబాఁతిన కంబము కరణిఁగాదె?
యశ మనశ్వరమనుమాట నాత్మనిల్పి
యని యొవర్పుఁడు. శుభముగ. వన్నెలార!

## 204

తమ మహారాజ్ఞి వాక్యరత్నములనెల్ల
వివి సముత్సాహపరులయి వీరవరులు
అసువులిడియైన మాతృదేశావనంబు
సలుపుదుమటంచు శపథముల్ సలిపిరంత.

205

వారలరుగ నసికినిపతులనెల్లఁ
బిలిచి తగు సలహాలిచ్చి వీడుకొలిపెఁ
బోటుమగలకు హర్షముప్పొంగి పౌరల
సమర సన్నాహములు పురిసాగుచుండె.

206

వారమయ్యెనొ లేదొ, దుర్వారయవన
వాహినులతోవజీర్ఖాను వచ్చెఁదిరిగి
వారినడుమ నవష్ఠానుదామగలిపె
కదలియటుగొండుసేనయు విడిసి పౌలిచె,

207

యవనబలభేరిధణ ధణారవము పెలఁగ
రాణిసేనలు ప్రతిశబ్దరాజి నెగడ
పరభసంబుగ వెలువడి పురమునుండి
యరిదళంబుల కెదురేఁగె నతి యొనర్ప.

208

పురుషవేషముతో దుర్గ తురగమెక్కి
బీరమునుజాటు చిచ్చరపిడుగువగిది
దుర్నిరీక్ష ప్రతాపంబుతోడవరుగఁ
బ్రేక్షకావళి గుండియల్ పెటిలిపోయె.

209

ఒక్క మొనరాణి యచ్చంపుటుక్కు మీఱి
తొడరిపేనల స్వయముగ నడుపుచుండ
నంతయువరాజు చెలఁగి వ్యూహాంతరమున
బాలభానువియోజ నత్ప్రభలవెల్గె.

210

తురకలను దుర్గసైన్యంబు తొడరితాఁక
మొగలు మొనలును జెలరేఁగి మోహరింప
నుభయపక్షములకును మహోగ్రమైన
పోరు ప్రారంభమయ్యెఁ గఠోరలీల.

211

పర్వకాలసముల్బణ వార్ధియుగము
తీరున బలద్వయంబుఁ దారసిలఁగ
నడచె సంకుల సమరంబు, పుడమినెత్రు
టేళ్లు ప్రవహించెఁ. దలపుత్తెలెగసె మింట.

212

చటులయోధాగ్ర పటుభుజాస్ఫాలనములు
నుద్భటభటాలి హుంకృతులుగ్రదండ
నాథతర్జన భర్జనల్ నాల్గుదెసల
నిండి నిబిడీకృతంబయి నింగిముట్టె

213

నారిమ్రోతలు విజయశంఖారవములు
పెనుహరుల హేషలు, కరీంద్రబృంహితములు
స్యందనధణం ధణలు ఖడ్గఝుంఝుళలును
భీకరలయాబ్ధిరవమొ నా భీతిఁ గొల్పె.

214

రయహయావళి తుంగతరంగచయము
వీరయోధుల పొగలు ఫేనతతులు
నడచుభటరాజి జలచరనక్రసమితి
గాఁగ రణసీమ సంద్రంబుకరణినొప్పె.

215

అంతఁబటురోష భీషణార్భటుల గోండు
యోధులు తురుష్కవీరు లొండొరులఁగవిసి
గురుకృపాణ శూలాదుల గ్రుచ్చిగ్రుచ్చి
తీవ్రముగఁబోర వెందతో త్రెళ్లిపడిరి.

216

సంగరంబున భుజబలశౌర్యలీల
నిజఖరాసి విదారిత నిఖిలవైరి
మస్తకుండయి యువరాజ మానసటీఁడు
సింగపుంబిల్ల వోలె గర్జించుచుండ.

217

అమ్మహాశూరు నెదిరింప నమవుగామి
కొందఱు మహమ్మదీయులు కుటిలవృత్తి
నట్టి సైంధవాదులబడి చుట్టుముట్టి
యంతమొనరించి రయ్యపరాభిమన్యు.

218

కటకటా ! బాలకుండను కరుణఁదక్కి
యెంతచేసిరి తురక లిపీయటంచు
ఖానుఁడూర్జిత క్రోధసంధానుఁడగుచు
మండుటెండలఁగాచె నుద్దండఫణితి.

219

అట్లు తనయుఁడు హతుఁడౌట నాలకించి
కటకటంపడ సమయంబు గాదటంచు
పొంగిపొరలెడి శోకంబు మ్రింగి యపుడు
దుర్గశౌర్యాగ్ని రెట్టింప దురమువిడక.

220

రౌద్రవీర భయానక రసములొలపి
కలసియాదేవి రూపంబు గాంచెనసఁగ
బాణసంధాన విద్యావిధానగరిమ
మించె చూపఱు మిక్కిలిమిణుకరింప.

221

అఖిలశాత్రవయోధ సంహార ఘోర
భీకర కరాళమూర్తియై పీఁకనరులఁ
జించి చెండాడి యఱవఱల్ సేయుదుర్గ
నద్దిరా క్షాత్ర వీర్యమత్యద్భుతంబు.

222

కదనమున రేఁగు ధూళి మేఘములుగాఁగ
మెలఁతదళతళ మెఱపెడు మెఱుపుగాఁగ
నారినినదంబు ఘనగర్జనంబుగాఁగ
బాణశంకణతతి జడివానకురిసె.

223

అంతమొగలాయి పోటరులాగ్రహించి
యట్టె చెలరేఁగి హుమ్మని యార్పుటించి
తెగువ నామెను బట్టిబంధింపనున్న
వారి హృదయంబు గ్రహియించి వీరదుర్గ.

224

కలఁతనొందక పిడువాలుఁ గత్తిదూసి
"దేశమాత ఋణంబిదే తీర్చెద"నని
తలను దెగవ్రేసికొనె దేవిత్యాగమేమొ!
తలఁచినంతన దేహంబు పులకరించు,

225

రాణి స్వేచ్ఛయు బీరము మానధనము
నపహరింపఁగఁ జాలని యరిబలంబు
గోండు పురిఁజొచ్చెఁ బిమ్మటి ఘోరగాథఁ
దడవనేటికిఁ బాపంబుతోడరుగాదె!

226

ఇంతలో నెంతగతి పట్టె నింతికకట!
తేజుమాసిన, మనియుంట ధీరలక్ష
ణంబు గాదని కూలెనో నాసహస్ర
కరుఁడు వగఁబ్రుంగి పడమటికడలిఁ గ్రుంకె.

227

తఱుఁగబడినట్టి యట్టలు తలలుఁ గాళ్లు
నవియివి యనంగనేల సర్వాంగకములు
కుప్పతిలి పీనుగుపెంటలు తిప్పలగుడు
భయదమై పౌలికలను భీభత్సమయ్యె.

228

బైసిమాలిన మ్లేచ్ఛులు ప్రాణఘాత
కృత్యములుసేయ జంకమినేవగించి
శీతకరముఖి కన్నెఱ్ఱచేసెనసగ
నింగి నెఱసంజకెంజాయ నెగడెనంత.

229

కాఱమను మాంసవిక్రేతకడ స్వకీయ
భీకరారావ ధనమిచ్చివిలిచి ఘోర
ఘూక ఫేరవములు గుంపుఁగూడి వేడ్కఁ
దివిరి శవఖండములమెక్కి త్రేఁపుచుండె.

230

కదనసీమను నాట్యరంగంబునందు
తాంతరిగణల, భూతభేతాళగణము
తాండవముసేయఁ దొడఁగె నుద్ధండలీలఁ
జుక్కలను ప్రేక్షకుల్ తొంగి చూచుచుండ.

231

అవనిఁ గుల దైవమగుట చేనలరి మొగలు
బత్తులకు నెల చల్వలఁబఱపెఁ గాని
వారియక్రమమును విని వనఁట జెంది
నిండువెన్నెల మంచు కన్నీటినించె.

232

మొగలు జోదులు మఱునాడు ముదముగదుర
దర్పమెలయఁగ విజయపతాక నెత్తి
దిగ్విజయవార్త ఢిల్లికిఁ దెలియఁజేయ
సర్వమాలించి పాదుషా చక్రవర్తి.

233

"అక్కటా! దుర్గమాయాజ్ఞ నవలఁద్రోచి
కొఱవి చేఁకొని తలఁగోకి కొనినకరణి
చెఱుచుకొనె కార్యమును దనచేతులార!"
నంచు వగ పైకి పొంగఁగా నటమటించె.

234

అల్ల హైందవ రాజ్యమొండౌర! నేఁడు
మా యధీనంబుగాఁ జెల్లె మహిని మొగలు
మగల నెదిరింపలేరను మహితకీర్తి
యొందెఁగా! యని లోలోన నుత్సహించె.

235

వక్రమతియగు పాదుషా చక్రవర్తి
మనసు గరళంబు రసనంబు మధుమయంబు
ధర్మదూరంబు గూఢ మాతనిమతంబు
బూటకంబాతని చరిత్ర నాటకంబు.

236

మహిత దుర్గావతీదేవి మాన్యచరిత
ధాత్రి భారతసతుల కాదర్శయగుత!
యామె తనయుని మనుగడ హైందవయువ
వితతి కెపు డొజ్జబంతియై వెలుఁగుగాత!

237

మాతృదేశాభిమాన సమ్మాన్య చరిత,
శాశ్వతాసమకీర్తి విస్తారభరిత,
యమల జీవనవిఖ్యాత త్యాగనిరత
రాణిదుర్గకుసాటి జగానఁగలరె ?

238

ఆమహావీరవనిత దేహంబువడిన
పుడమిని సమాధి నిర్మింపబడియె, నామె
స్మృతికి గుఱుతుగ, నదిగను ప్రేక్షకులకు
నెమ్మదిగలంగు, నుడుకురక్తమ్ము పొంగు.

239

తనువు సాలించునప్పు డాధన్యురాలు
"జననియును జన్మభూమియు స్వర్గలోక
మునకు మించిన, వెప్పుడుఁ బూజ్యములని
యాడిన ప్రబోధ మాదర్శమగుత ! మనకు

240

భరతదేశంబు మిన్నయై ప్రబలుఁగాత !
ప్రజల స్వేచ్ఛామహాలత ప్రాఁకుఁగాత !
విమల సోదరభావంబు వెలయుఁగాత !
జగతి నీ చిట్టికబ్బంబు నొగడుఁగాత

సమాప్తము



RAJA PRINTERS, MADRAS-1

## (ఈ గ్రంథకర్త ఇతరకృతులు)

రత్నాబాయి, (నవల)
(తొలిపలుకు, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు)

మోహన, (నవల)
(తొలిపలుకు, శ్రీ బి. మునుస్వామి నాయుడుగారు)

వీర గాంధర్వము, (నవల)
(పీఠిక, శ్రీ ఆర్. బి. రామకృష్ణ రాజుగారు)

రంతిదేవుఁడు (పురాణ కథ)
(ముందుమాట, శ్రీ సర్వేపల్లి, రాధాకృష్ణ పండితులుగారు)

పూలగుత్తి (ఖండకావ్య సంపుటి)
(మున్నుడి. శ్రీ పి. వి. రాజమన్నారుగారు)

శ్రీ మునిస్వామి నాయుఁడు (జీవితము)

రాజా ప్రింటర్స్. 2, తాతాముత్తియప్పన్ వీధి, మద్రాసు-1.